వేదోఽఖిలో ధర్మమూలమ్ | ఓ౩మ్ | కృణ్వంతో విశ్వమార్యమ్

వేదమూలమిదం జ్ఞానమ్

# సామవేద - సంహిత

(ఋషి, దేవత, ఛన్దస్సు, స్వరము, మంత్రానుక్రమణిక, పరిచయము సహితముగా)


భాష్యానువాదకులు, సంపాదకులు, పరిశోధకులు

*సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద*

**ఆచార్య మట్టి కృష్ణారెడ్డి** ఎం.ఏ.,ఎం.ఎడ్. (పి.హెచ్‌డి.)

ప్రధానాచార్యులు

*శ్రీ బిజ్జ అనంతయ్య స్మారక ప్రాచ్యకళాశాల, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా.*

# సామవేద పరిచయము

# సామవేద పరిచయము

"వేదానాం సామవేదోఽస్మి" అని శ్రీకృష్ణభగవానుడు చెప్పిన గీతావాక్యము వలన సామవేదమునకుగల ఉత్కృష్టత స్పష్టమగుచున్నది. ఛాందోగ్యములో "సామ్న ఉద్గీథో రసః" అని చెప్పబడినది. ఉద్గీథ అనగా ఓంకారము. "ప్రణవః సర్వవేదేషు", "ఓంకారః సర్వవేదానాం" ఇత్యాది వచనముల వలన ఓంకార ప్రాశస్త్యము తెలియును. ఇట్లు ఓంకారమూలకమైన దగుటచేతనే సామవేదము వేదములకెల్ల తలమానికము వంటిదని భావింపబడుచున్నది. "సామాని యో వేత్తి స వేదతత్త్వమ్" అని సామమెరిగిన వానికే తత్త్వజ్ఞాన మబ్బునని చెప్పబడినది. ఋగ్వేదములో పలుచోట్ల సామము ప్రశంసింపబడినది. వైరూప, బృహద్, రైవత, గాయత్రి భద్రాది సామములు కొన్ని ఋగ్వేదములో పేర్కొనబడినవి. యజుర్వేదములో రథంతర, వైరాజ, వైఖానస, వామదేవ్య, శాక్వర, రైవత, అభివర్తాది సామములు పేర్కొనబడినవి. "ఋచం సామ యజామహే" అని అథర్వవేదము కూడ సామమును కీర్తించినది. ఐతరేయమున నైధన, కారవ, ధ్రుదాజయ, అగ్నిష్టోమీయ సామములు స్మరింపబడినవి. "నాసామా యజ్ఞో భవతి" అని సామము లేనిదే యజ్ఞమే లేదని చెప్పబడినది.

సామవేదములోని మంత్రములు మూటికి రెండు పాళ్ల వరకు ఋగ్వేదము నుండి గ్రహింపబడినవే. "ఋచి అధ్యూఢం సామ" అని ఋక్కులనే ఆధారముగాగొని సామము ఏర్పడుటచే ఛాందోగ్యమున వీనికి పతిపత్నీభావ మూహింపబడినది. బృహదారణ్యకములో "సా చ అమశ్చేతి తత్ సామ్నః సామత్వమ్" అని ఋక్కులపై గాంధారాది స్వరములు చేర్చినందున సామమేర్పడునని యు కనుకనే అది 'సామము', అనగా 'గానము', అని పిల్వబడునని యు చెప్పబడినది. "గీతిషు సామాఖ్యా" అని జైమిని గేయమంత్రములకే సామమను పేరు వర్తించునని చెప్పెను. వేదవ్యాసుని వద్ద మొదట ఈ సామవేదమును జైమిని చదివెను. అతని వద్దనుండి యిది అతని శిష్యప్రశిష్యులకు సంక్రమించెను. శిష్యబాహుళ్యము శాఖా బాహుళ్యమునకు తావిచ్చి యిది సహస్రశాఖయై విస్తరిల్లెను. ఒకప్పుడు దీనికి ఉదీచ్యప్రాచ్యశాఖ లని రెండు ముఖ్యశాఖా భేదము లుండెను. కాని నేడు సామవేదులు దాక్షిణాత్య ప్రతీచ్యశాఖానుయాయులుగనే కాన్పింతురు. శాఖలు కూడ మూడే మిగిలినవి. వానిలో కౌథుమశాఖ గుజరాతులోని నాగర బ్రాహ్మణులలో నిలిచినది. రాణాయనీ శాఖ మహారాష్ట్రములోను, దక్షిణమున రామేశ్వర ప్రాంతమునను మిగిలినది. జైమినిశాఖ కర్ణాటకమున ప్రచారములో నున్నది. ఈ మూడిటి సంహితలును అచ్చయినవి.

**మొదలు - చివర :**

ఈ సంహిత "అగ్న ఆయాహి వీతయే" అనే అగ్నిదేవతా మంత్రంతో ప్రారంభమై "స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః" అనే స్వస్తి మంత్రంతో పూర్తవుతున్నది.

సామసంహిత పూర్వార్చికమని, ఉత్తరార్చికమని రెండుగా విభజింపబడింది. ఋక్కుల సమూహానికే ఆర్చిక మని పేరు. పూర్వార్చికంలో ఆరు ప్రపాఠకాలున్నాయి. ప్రతి ప్రపాఠకం రెండు అధ్యాయాలుగా విభజింపబడింది. అలా పూర్వార్చికంలో మొత్తం ౧౨ అధ్యాయాలున్నాయి. మొదటి ఐదు ప్రపాఠకాలలోను, ప్రతి ప్రపాఠకంలో పది దశతులుంటాయి. పదిమంత్రాలున్న భాగానికి 'దశతి' అని పేరు. ఆరవ ప్రపాఠకంలోను తొమ్మిది దశతులు మాత్రమే ఉన్నాయి. ఇలా పూర్వార్చికంలో ఆరు ప్రపాఠకాలు, పన్నెండు అధ్యాయాలు, ఏభైతొమ్మిది దశతులు ఉన్నాయి.

అందులో మొదటి పన్నెండు దశతుల్లో అగ్నిస్తుతి కనబడుతుంది. తరువాతి ముప్పైఆరు దశతుల్లో సోమపానం చేసే ఇంద్రుడు స్తుతింపబడ్డాడు. చివటి పదకొండు దశతుల్లో సోమస్తుతి గోచరిస్తుంది.

ఉత్తరార్చికంలో తొమ్మిది ప్రపాఠకాలున్నాయి. అందులో ప్రతి ప్రపాఠకంలోను అర్ధ మనే పేరుతో రెండుగాని లేక మూడుగాని విభాగాలున్నాయి. వీటికే అధ్యాయాలని కూడా పేరు. ప్రతి విభాగంలోను దాదాపు మూడు మంత్రాలున్నాయి. ఇందులోని ప్రతి మొదటి మంత్రం ప్రథమార్చికంలో కూడ కనబడుతుంది. ఇందులో మొదటి అయిదు ప్రపాఠకాల్లో రెండేసి అధ్యాయాల చొప్పున, చివటి నాలుగు ప్రపాఠకాల్లో మూడేసి అధ్యాయాల చొప్పున మొత్తం తొమ్మిది ప్రపాఠకాల్లో ౨౨ అధ్యాయాలున్నాయి.

ఈ రెండు ఆర్చికాలకు మధ్య 'మహానామ్న్యార్చిక' మనే పేరుతో పదిమంత్రాలున్నాయి. మిగతావాటిలాగా వీటికి ఋషి దేవత ఛందస్సులు కనబడవు. ఈ మంత్రాల్లోను ఇంద్రస్తుతే చేయబడింది.

ఈ సంహితలోని పూర్వార్చికంలోగల ఆరు ప్రపాఠకాల్లోని మంత్రాలు మొత్తం ౫౮౫. ఉత్తరార్చికంలోని తొమ్మిది ప్రపాఠకాల్లో గల మంత్రాలసంఖ్య ౧౨౨౦. ఇవిగాక కొందఱు విమర్శకులు అరణ్యక-కాండలోని ౫౫, మహానామ్న్యార్చికంలోని పది మంత్రాలు కలిపి మొత్తం సామసంహితలోని మంత్రాలు ౧౮౭౫ అంటారు.

ఈ మంత్రాల్లో చాలాభాగం ఋక్సంహిత ఎనిమిది తొమ్మిది మండలాల్లోనుంచి తీసుకోబడ్డ ఋక్కులే ఉన్నాయి. అవి సుమారు ౧౫౦౪ ఉంటాయని కొందఱు విమర్శకుల అభిప్రాయం. ఋగ్వేదంలో కనబడకుండా కేవల సామవేదంలోనే స్వతంత్రంగా ఉన్నమంత్రాల సంఖ్యను గురించి కూడా అభిప్రాయ భేదాలున్నాయి. కొందఱు ఇవి ౯౯ ఋక్కులంటే వింటర్నిజ్ ప్రభృతులు ౭౫ అంటున్నారు.

| పూర్వార్చికం | | | ఉత్తరార్చికం | | |
|---|---|---|---|---|---|
| ప్రపాఠకాలు | దశతులు | మంత్రాలు | ప్రపాఠకాలు | దశతులు | మంత్రాలు |
| ౧ | ౧౦ | ౯౬ | ౧ | ౧౨ | ౧౨౪ |
| | | | ౨ | ౧౨ | ౧౧౧ |
| ౨ | ౧౦ | ౯౮ | ౩ | ౧౪ | ౧౪౫ |
| | | | ౪ | ౧౩ | ౧౪౨ |
| ౩ | ౧౦ | ౯౯ | ౫ | ౨౧ | ౧౮౦ |
| ౪ | ౧౦ | ౯౭ | ౬ | ౧౫ | ౧౪౨ |
| | | | ౭ | ౧౨ | ౧౨౦ |
| ౫ | ౧౦ | ౯౬ | ౮ | ౧౩ | ౧౪౩ |
| ౬ | ౯ | ౯౯ | ౯ | ౭ | ౧౧౧ |
| మొత్తం | ౫౯ | ౫౮౫ | ౯ | ౧౨౦ | ౧౨౨౦ |

అరణ్యకకాండలోని మంత్రాలు ౫౫, మహానామ్న్యార్చికంలోని మంత్రాలు ౧౦. వాటిని పూర్వార్చిక, ఉత్తరార్చిక మంత్రాలలో కలిపితే మొత్తం మంత్రాలు ౧౮౭౫ దశతులు ౧౭౯ ప్రపాఠకాలు౧౫.

సామసంహితలన్నియు ఆర్చికము లనియు, గానము లనియు రెండు విధములు. ఋక్కులకే ఆర్చికములని పేరు. కాగా, ఆర్చికములలో సామగానమున కుపకరించు మంత్రములన్నియు సంగ్రహింపబడినవనియు, గానసంహితలో ఆవేమంత్రములు గేయరూపములో సంతరింపబడినవనియు తెలియునగును. సామగానము ౪ విధములు. (౧) గ్రామ గేయగానము. ఇది గ్రామములో పాడదగినది. దీనిని వేయగానమనికూడ పేర్కొందురు. (౨) అరణ్యగేయగానము. ఇది అరణ్యములో పాడదగినది. గ్రామగేయ అరణ్యగేయములకు ప్రకృతిగానము లని వ్యవహారము. వీని ననుసరించి (౩) ఊహగానము, (౪) ఊహ్యగానము అనునవి వికసించును. మొదటి రెండును పూర్వార్చికమునకును, చివరిరెండును ఉత్తరార్చికమునకు సంబంధించును. సామగానవిధానము ఉత్తరార్చికములో కొంత వివరింపబడినది. ఋక్ ప్రాతిశాఖ్య, తైత్తిరీయ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, పుష్పసూత్ర, సామసూత్ర, నారదశిక్షాదులలో మరికొంత విస్తారముగా ఈ విషయము వర్ణింపబడినది.

నారదీయశిక్షలో సామస్వరములు ౭ చెప్పబడినవి. అట్లే ౩ గ్రామములు, ౨౧ మూర్ఛనలు, ౪౯ తానములు పేర్కొనబడినవి. సామసప్త స్వరములు. వేణువులో వరుసగా మ గ రి స ని ధ ప అను స్వరములకు సరిపోవును. సామగాన పాఠములలో స్వరములు ౧ నుండి ౭ వరకు అంకెలువేసి చూపబడును. ఉచ్చైస్తరమను స్వరము ౧౧ అంకెతో చూపబడును. సామమంత్రములలో స్వరచిహ్నములుంచు పద్ధతి దీనికి భిన్నము. గానభాగములో సంగీతానుకూలముగ చేసిన మార్పులు సామవికారములని పిలువబడును. అవి ఈ క్రిందిపద్ధతిలో ఆరు విధములుగా నుండును.

(౧) వికారము - 'అగ్నే' అనుటకు బదులు ఒగ్నాయి అనుట.

(౨) విశ్లేషణము - 'వీతయే' అనుటకు వో యిတోయాఽయి అనుట.

(౩) వికర్షణము - 'యే' అనుదానిని యా 2, 3, యి, అని సాగదీయుట.

(౪) అభ్యాసము - 'తయే' అనుచోట తోయాయి, తోయాయి అని రెండు సార్లు పలుకుట.

(౫) విరామము - 'గృణానో హవ్యదాతయే' అను పదమును గృణానోహ, వ్యదాతయే అని విరిచి చదువుట.వెలకొనును. ఈ గానరసమునకు లోపురసము చేయూత ఇచ్చినట్లుండును. యజ్ఞములో సామాహరణాది ప్రసంగములు చాల రసవంతములు.

సోమమనునది ఒక లత. ఋగ్వేదములో ఈ లత మూజవానపర్వత ప్రాంతమునను కురుక్షేత్రములోని శర్యణావత్ ప్రదేశములోను దొరకునని చెప్పబడినది. ఇది నదీతీరములలో నాచువలె పెరుగునట. పర్వత ప్రాంతములలో లతవలె పెరుగునట. దీనికి పర్వతావృధ, గిరిష్ఠ మున్నగు పేర్లు చెప్పబడినవి. చంద్రునితో సామ్యముచెప్పి చంద్రకళలతో పాటు పెరుగుచు తరుగుచు నుండు ఆకులు గలదిగా వర్ణింపబడినది. కొందరిది అరటిదుంపవంటి దుంప అనియు, లతగా ప్రాకునదియు, నీటిలో తేలునదియు, దీనికి గిరి ఆకులుండు ననియు, అధర్మపరులకిది కనబడదనియు చెప్పుదురు. నిజమునకిది యీనాడు కనబడదు. అప్పటికే ఈ లత దేశములో మృగ్యమైనట్లున్నది. అందుకే దీనికి అనుకల్పములు చెప్పెను. ఈ అనుకల్ప విధి ననుసరించి యీనాటి యజ్ఞములలో సోమలతకు మారుగా కారుగవుపో తిప్పతీగను వాడుదురు.

సోమయాగములలో సోమాహరణమే ఒక పెద్ద కలాపము. సోమాహరణ సూక్తములకు సౌపర్ణసూక్తములని పేరు. సోమలతను అధ్వర్యుడును యజమానియు కొందరు దానిని ౩౬ అంగుళముల పొడవు, ౧౮ అంగుళముల వెడల్పు గల అధిషవణ ఫలకముమీద కృష్ణాజినము పరచి, దానిపై నుంచెదరు. ఆ మీద దాని నభిమంత్రించుచు నీటితో తడుపుచు నాలుగు శిలాయంత్రములతో నూరుదురు. తరువాత దానిని ఆహవనీయపాత్రలో వేసి నీరు ఒడ్డి లతను పిండి నీళ్ళలో కలుపుదురు. కనపుతీసిన లతకు ఋజీష అని పేరు. దీనిని దశాపవిత్ర వస్త్రములో మూటగట్టినట్లు కట్టి రసము ధారగా పడునట్లు పడియగట్టుదురు. ఈ విధముగా పిండిన రసము ముందు దేవతలకిచ్చు హోమముచేసి వషట్కారములు చెప్పుదురు. ఆ మీద హోమావశేషమును ఉద్గాత, యజమాని, బ్రహ్మ, సహస్రకుడు గ్రహింతురు. ఆయా దేవతల కర్పించునపుడు సోమరసమును పాలు, పెరుగు, వేయి సువర్ణరజము మున్నగువానితో కలిపి అర్పించెదరు. యజ్ఞదినములలో ఈ కలాపము దినమునకు మూడుసార్లు జరుపుదురు. సోమరసమును మధువనీ, మధుమత్ అనీ, పీయూషమనీ వ్యవహరింతురు. ఆయా వస్తువులు కలిపినపుడు దీనిని ఆశిర, గవాశిర, యవాశిర మున్నగు పేర్లతో వ్యవహరింతురు.

సూత్రములలో సోమరస భేదములు ఇరువది నాలుగు వరకు వేదోక్తములుగా వర్ణింపబడినవి. ఇది సువర్ణపాత్రలో త్రాగవలసినదిగా చెప్పబడినది. దీనివలన హర్షోత్సాహములే కాదు బ్రహ్మజ్ఞానోదయమున కనుకూలించు స్వస్థత కలుగునని వివరింపబడినది. ఇది అమృతము. విశుద్ధ బుద్ధియు నిర్మల జ్ఞానమును దీని ఫలములు

ఇది చిత్తస్వాస్థ్య మిచ్చుననియు తెలియజేయు మంత్రములు ఋగ్వేదములో పలుచోట్ల కన్పించును. పైగా ఆధ్యాత్మికముగా అర్థము వివరించునపుడు సోమరసమునకు నిర్మలజ్ఞానము, బ్రహ్మానందరసము మున్నగు సాంకేతికార్థములు గ్రహింతురు.

సామవేదము ముఖ్యముగా యజ్ఞప్రయోగమునకే ఏర్పడినట్లుండును. దీని మంత్రములన్నియు ఋగ్వేదమునుండి గ్రహించినవే. గానమే దీని సొంతము. అయినను ఆగానము ప్రణవనిర్భరమై తత్పరిణామమై ఉదాత్తాంబరమై వెలయుచుండుటచేత సామము సర్వోత్కృష్టమైన విద్యగా భావింపబడుచున్నది. ఛాందోగ్యమున సామసారమగు ఉద్గీథవిద్య, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక, సంపదలకు మెరుగు నమకూర్చునదిగా వర్ణింపబడినది. సోమయాగములో సోమదేవతాకమైన మంత్రము లన్నియూ సామవిధానము ననుసరించి గానముచేయబడును. బహిష్పవమానాది సూక్తములవంటి ( ఋత్విజులందరు సామూహికముగా గానము చేయునట్టి ) ప్రసంగము లీ యజ్ఞములలోవలె దర్శ, పూర్ణమాసాదులలో కలుగవు. ఇట్లే యజమాని కిష్టకామ్యార్థము లొనగూర్చుటకై, ఆయా దేవతల నుద్దేశించి తత్తత్ స్తుతిపరములైన సూక్తములు గానముచేయుదురు. ఒక్కొక్క దేవత కొక్కొక్క విధమైన స్తోభాక్షరములు ప్రయోగించుదురు. గానముచేయు ఋత్విగ్విభేదము ననుసరించి యిట్టి సామస్తోత్రములను ప్రస్తావభక్తి ఉద్గీథభక్తి అనికూడ

వ్యవహరింతురు. సామము దేవతలకు ప్రియమైనది. లోకవ్యవహారములో కూడ సామముగా ప్రియముపలుకుట, నయము సమకూర్చుట అనియే అర్థము. శ్రుతి కూడ "యద్ వై సాధు తత్ సామ" అని ఏది సాధువో అనగా ఏది శుభావహమో శోభనమో అదియే సామమని కీర్తించినది.

సామాన్యంగా వేసే లెక్కలో సామవేదం మూడోదైనా ఋగ్వేదంతో దీనికున్న సన్నిహితసంబంధాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, ఋగ్వేదం తరువాత రెండవస్థానం సామవేదానికి లభిస్తుంది. చారిత్రికంగా దీనికంత ప్రాధాన్యం లేదు. ఎందువల్లనంటే ఇందులో మంత్రాలు ఎక్కువ భాగం ఋగ్వేదంలోని ఎనిమిది తొమ్మిది మండలాలనుంచే స్వీకరింపబడ్డాయి.

సామవేదం కూడా యజుర్వేదంలాగా యజ్ఞాచరణంలో బాగా ఉపయోగపడుతుంది. ఎక్కువగా ఇందులోని మంత్రాలు సోమయాగంలో ఉద్గాతలచేత గానం చేయబడతాయి.

**సామ అంటే ఏమిటి ?**

'సామ' అనే పదానికి 'గాన' మని అర్థం. ఋక్కులే రాగబద్ధంగా గానం చేయబడితే, సామలని వ్యవహరించబడతాయి. అర్థాన్ననుసరించి పాదబద్ధంగా ఉండే మంత్రానికి 'ఋక్కు' అని ఋక్కు స్వరబద్ధమై స్తోభవర్ణాలతో కలిపి గానం చేయబడేటప్పుడు 'సామ' అనబడుతుందని, జైమిని "గీతిషు సామాఖ్యా" ( మీ. ద. ౨.౧.౩౬.) అని సూత్రీకరించాడు.

**విషయం :**

సామవేదంయొక్క ప్రధాన ప్రయోజనం యజ్ఞయాగాదుల్లో ఆయా గానాలద్వారా ఉపయోగపడటం. ఈ సంహితలోని మంత్రాలకు, ఋక్కులకు స్వరభేదంవల్ల స్వరూపభేదం ఏర్పడింది. గానలక్షణాలతో ఈ మంత్రాలను గానంచేసే విధానం గానగ్రంథాల్లో వివరింపబడింది. వర్ణాలను త్రిప్పి త్రిప్పి ఉచ్చరించడం, అక్షరాలను దీర్ఘంతీసి పఠించడం, మధ్యలో కొత్త అక్షరాలను వేయడం మొదలైన సంగీతశాస్త్రంలో పాటింపబడే విశేషాలన్నీ వీటిల్లో వివరింపబడ్డాయి. సోమయాగానికి సంబంధించిన విశేషాలు మనమిందులో గమనించవచ్చు. ఋక్కులు గానానుగుణంగా ఇందులో ఉపయోగింపబడటంవల్ల ఋగ్వేదప్రమేయానికి దీనికి తేడా చాలా తక్కువ అని అనుకోవచ్చు.

**ఉపవేదం :**

సామవేదానికి ఉపవేదం గాంధర్వవేదం. ఈ గాంధర్వ వేదం సామగానాన్ని సంగీతాన్ని కూడా వివరించింది. నృత్య గీత వాద్యాలను (తౌర్యత్రికం), సప్తస్వరాలను, మూడుగ్రామాలను ౨౧ మూర్ఛనలను, ౪౯ తానాలు ప్రతిపాదిస్తున్న ఈ వేదం భారతీయ సంగీతశాస్త్రానికి మూలభూతమైందని నారదీయ సామశిక్షద్వారా తెలుస్తున్నది.

**మొత్తం శాఖలు :**

సామవేదానికి వెయ్యి శాఖలున్నట్లు తెలుస్తుంది. వ్యాకరణ మహాభాష్యకారుడైన పతంజలి సహస్రవర్త్మా సామవేదః అన్నాడు. ఇక్కడ వర్త్మపదం వెయ్యిరకాల గానాలను చెబుతుందిగాని శాఖలను చెప్పదని కొందరి అభిప్రాయం. కాని శ్రీమద్భాగవతం చరణవ్యూహ పరిశిష్టం, విష్ణుపురాణం ఈ వేదంలో ఒకప్పుడు వెయ్యి శాఖలున్నట్లు పేర్కొంటున్నాయి. ఇందులో చాలా శాఖలు కాలగర్భంలో కలిసిపోయాయి.

సామవేదానికి వెయ్యి శాఖలున్నట్లు దివ్యావదాన మనే బౌద్ధ గ్రంథం కూడ ఇలా పేర్కొంటున్నది

౧. శిలపల్కా : పంచవింశతి : ౨౫

**౨. కౌథుమానాం శతం ౧౦౦**

**౩. మహాసమానాం పంచశతాని ౫౦౦**

**౪. సాత్యముగ్రాణాం శతం ౧౦౦**

**౫. లౌకాక్షాశ్చత్వారింశత్ ౪౦**

**౬. బ్రహ్మసమానాం శతం ౧౦౦**

**౭. మహాయోజికానాం శతం ౧౦౦**

**౮. సమస్త వేదానాం శతం ౧౦౦**

## మొత్తం ౧౦౬లో శాఖలు.

చరణవ్యూహపరిశిష్టంలో సామవేదానికి ౧. రాణాయనీయ ౨. శాట్యాయనీయ ౩. శాట్యముగ్ర ౪. కల్పల ౫. మహాకల్పం ౬. లాంగల ౭. కౌథమీయ ౮. గౌతమీయ ౯. జైమినీయ భేదంతో తొమ్మిది శాఖలున్నట్లు చెప్పబడింది. ఇదే గ్రంథం ఇంకొక శాఖాక్రమాన్ని కూడా ఇలా పేర్కొంటున్నది. ౧. రాణాయనీయ ౨. శాట్యముగ్ర ౩. కాలేయ ౪. మహాకాలేయ ౫. లాంగలాయన ౬. శార్దూల ౭. కౌథుమభేదంతో ఏడుశాఖలు.

రాణాయని, సాత్యముగ్రి, దుర్వాసుడు, భాగురి, (గౌ) భారుండి, గౌల్గులవి, భానుమన్యవుడు, కారాటుడు, గార్గ్యసావర్ణి, వార్షగణ్యుడు, కుథుమి, శాలిహోత్రుడు, జైమిని అని సామగానాచార్యులు పదముగ్గురిని చరణవ్యూహటీకలో మహిదాసు పేర్కొంటున్నాడు.

### ఇప్పుడు దొరుకుతున్నవి :

ఇప్పుడు రాణాయనీయ, కౌథుమ, జైమినీయ శాఖలు మూడు మాత్రం దొరుకుతున్నాయి. గౌతమశాఖకూడా మనదేశంలో ఏదో భాగంలో ఉండేదని చెబుతారు. మూడు వందల సంవత్సరాలకు పూర్వం శార్దూలశాఖ ఉన్నదని, తరువాత నశించిపోయిందని వేదపండితులు చెబుతున్నారు.

మంత్ర - బ్రాహ్మణ - శ్రౌత - స్మార్త సూత్రాలు ప్రాతిశాఖ్యం రాణాయనీయ శాఖకు కౌథుమశాఖకంటే భిన్నంగా లేవు. జైమినీయశాఖకు వేరుగా ఉన్నాయి.

### శాఖలు - దేశవ్యాప్తి

సామసంహితను ప్రచారం చేసినవాళ్ళలో ముఖ్యుడు జైమిని. ఈయన వేదవ్యాసునిద్వారా సామవేదాన్ని అధ్యయనం చేశాడు ఇతని జన్మస్థానం ద్వైతవనం జైమిని తన కుమారుడైన సుమన్తునికి సామవేదాన్ని బోధించాడు. సుమన్తుని ద్వారా అతని కొడుకు 'సుత్వ'. సుత్వద్వారా అతని కుమారుడు సుకర్మ ఈ వేదాన్ని అధ్యయనంచేసి పరంపరను కాపాడారు.

సుకర్మ ఎంతమందికో ఈ వేదాన్ని నేర్పి సుమారు ౧౦౦౦ సంహితలకు ప్రచారకుడైనాడు ఇంద్రప్రకోపం (జలార భూకంపంవల్ల) ఈ సుకర్మ శిష్యులుండే ప్రాంతమంతా భూగర్భంలో కలిసిపోయింది. ౧౦౦౦ శాఖలూ అంతరించి పోయాయి. తరువాత ఇతనికి పౌష్యంజి, కోసల దేశాధిపతియైన హిరణ్యనాభుడనే ఇద్దరు శిష్యులేర్పడ్డారు. సుకర్మ వీరిద్దరికి చెరి ౫౦౦ శాఖలను అధ్యాపనం చేశాడు. పౌష్యంజి సంప్రదాయానికి ఉత్తరదేశీయ సామపరంపర అని, హిరణ్యనాభ సంప్రదాయానికి ప్రాచ్యదేశ పరంపర అనే పేరు ప్రసిద్ధి వచ్చాయి.

ఈ పౌష్యంజికి ౧. లౌగాక్షి ౨. కుథుమి ౩. కుసీది ౪. లాంగలి అని నల్గురు శిష్యులు. ఇందులో లౌగాక్షికి ౧. రాణాయని ౨. తాండ్య ౩. అనోవైన (మూలచారి) ౪. సకైతిపుత్ర ౫. సాత్యముగ్రులనే అయిదుగురు శిష్యులున్నారు. సుసామ అనేవాడు కూడ ఇతనికి ఆరవ శిష్యుడని బ్రహ్మాండపురాణం పేర్కొంటున్నది.

ఇలా జైమిని శిష్యపరంపరద్వారా భారతదేశమంతటా వెయ్యి శాఖలతో వ్యాప్తిలోకి వచ్చిన సామవేదానికి ఎక్కడా ఆశ్రయంలేక ఇప్పుడు ఎంతో దీనస్థితిలో ౩ శాఖలుమాత్రం రెపరెపలాడుతున్నాయి అవికూడ అట్టేకాలం నిలుస్తాయని నమ్మకంలేదు.

కుథుమిమహర్షిచేత ప్రవర్తింపజేయబడింది కౌథుమశాఖ. రాణాయని ప్రవర్తకుడుగ గలది రాణాయనశాఖ. జైమినిద్వారా ప్రచారంలోకి వచ్చింది జైమినీయశాఖ.

నశించిపోయిన శాఖలు పోగా ప్రస్తుతం తమిళనాడు, బెంగాల్, బీహార్, గుజరాత్ రాష్ట్రాల్లో వ్యాపించి, అక్కడ నతువ పాఠనారుల్లో ఉన్న శాఖ కౌథుమశాఖ. తమిళనాడు (తిరునల్వేలి) కేరళలో జైమినీయ శాఖ వ్యాపించింది. కర్ణాటక రాష్ట్రంలోను, ఆంధ్రప్రదేశ్‌లోని సింహాచలప్రాంతంలోను (ఒకే ఒక కుటుంబంలో) వ్యాప్తిలోనున్న శాఖ రాణాయనీయ శాఖ. ఈ రాణాయనీయ శాఖ ఒకప్పుడు మహారాష్ట్రలో ప్రచారంలో ఉండేదని తెలుస్తున్నది.

శార్దూల సాఖకి సంబంధించిన వివరాలు కొన్ని కాశీలో దొరకడంవల్ల ఈ శాఖకు ఆ ప్రాంతంలో ప్రచారం ఉండేదని తెలుస్తున్నది.

### పాఠవిశేషాలు

సామసంహితా శరీరానికి ఈ స్తోభాక్షరాలు, శరీరమంతటా నిండి శరీరాన్ని బిగువుగా ఉంచే రోమాల్లాంటివని సామవిధాన బ్రాహ్మణం పేర్కొంటున్నది.

దీనికి సంబంధించినగానం 'ప్రకృతి' అని 'ఊహ' అని రెండు రకాలు. 'గ్రామగేయము' ని (గ్రామంలో గానం చేయతగింది) 'అరణ్యగేయ' మని (అరణ్యంలో గానం చేయదగింది) ప్రకృతి రెండు విధాలు. దీనినే 'గానసంహిత' అని కూడ అంటారు. గ్రామగేయమనే భాగానికి సంబంధించిన ఊహకే ఊహగాన మని, అరణ్యగేయ భాగానికి చెందిన ఊహకే రహస్యగాన ' మని వ్యవహారం. ప్రకృతిలో ఏడు గానాలున్నాయని, ఊహ ఏడు తంత్రాలతో కూడినదని సర్వానుక్రమణిక చెబుతుంది.

౧. గాయత్రం ౨. ఆగ్నేయం ౩. ఐన్ద్రం ౪. పావమానం ౫. అర్కపర్వ, ద్వంద్వపర్వ, వ్రతపర్వ అని మూడుపర్వాలు ౬. శుక్రియం ౭. మహానామ్ని అని ప్రకృతిలో మొత్తం ఏడుగానాలు.

ఊహలో ౧. దశరాత్రం ౨. సంవత్సరం ౩. ఏకాహం ౪. అహీనం ౫. సత్రం ౬. ప్రాయశ్చిత్తం ౭. క్షుద్రమని ఏడు తంత్రాలున్నాయి.

సామగానం చేసేటప్పుడు సప్తస్వరాలను, మూడుగ్రామాలను, ౨౧ మూర్ఛనలను, ౪౯ తానాలను దృష్టిలో పెట్టుకోవాలి. ఉద్గాతలు యజ్ఞాల్లో మంద్ర, మధ్యమ, తారస్థాయిల్లో ఉదయ - మధ్యాహ్న-సాయంకాలాల్లో స్తోత్రరూపమైన గానం చేస్తారు.

ఒక ఋక్కును తీసుకొని స్వరబాహుళ్యంతో చేసే గానానికే సామ అనిపేరు. ప్రకృతిలో ఒక ఋక్కుకు ఒక 'సామ' గానం చేయడం జరుగుతుంటుంది. కాని కొన్నిచోట్ల ఒకే ఋక్కులో రెండు మూడు, నాలుగు ఇలా పదహారు సామల దాకా గానం చేయడం. కూడాఉంది. ఒకచోట పద్దెనిమిది సామగానాలు కూడా అనేక పద్ధతుల్లో ఒకే ఋక్కుకు ఉన్నాయి. ఉదాహరణలకే 'రథంతరసామ,' "బృహత్సామ, " 'వామదేవ్యసామ' అని అనేకరకాల పేర్లున్నాయి.

ఋక్కును సామగా గానం చేసేటప్పుడు అందులో ఉండే అయిదుభాగాలను బాగా అర్థం చేసుకోవాలి. అవి ౧. ప్రస్తావం ౨. ఉద్గీథం ౩. ప్రతిహారం ౪. ఉపద్రవం ౫. నిధనం అని పిలవబడతాయి.

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే నిహోతా సత్సి బర్హిషి

అనే మంత్రాన్ని గానం చేసేటప్పుడు ఈ ఐదు భాగాలు ఎక్కడున్నాయో చూడండి :

౧. హుం అగ్నా ౩ (ప్రస్తావం).

ఇక్కడ హుం శబ్దంతో ప్రారంభించడానికే ప్రస్తావం అనిపేరు.

౨. ఓం ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే (ఉద్గీథం).

ఇక్కడ ఓం శబ్దంతో ఆరంభించి ఋత్విక్కు గానం చేస్తాడు.

౩. నిహోతా సత్సి బర్హిషి ఓమ్ (ప్రతిహారం).

ఓం చివర వచ్చేట్లు ఋత్విక్కు గానం చేస్తాడు.

౪. నిహోతా సత్సిబ (ఉపద్రవం) ఇది ఉద్గాతచేత గానం చేయబడుతుంది.

౫. ర్హిషి ఓమ్ (నిధనం)

దీన్ని ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహర్త ము॥ అంతా కలిసి గానం చేస్తారు.

సామగానంలో ఔ, హా, వా, హో అనే శబ్దాలు ప్రత్యేకమైన అర్థం ఏదీ లేకపోయినా గేయం శిథిలం కాకుండా సాగడానికి ఉపయోగపడతాయి.

సామవేదం గానప్రధానమైంది కావడంవల్ల ఇతర వేదాల్లో లాగా జటాదివికృతిపాఠాలు ఇందులో నిలబడలేదు. కేవలం పదపాఠం స్తోభపదపాఠంమాత్రమే ఇందులో మనకు కనబడుతున్నాయి. సామగానప్రభావం ముందు ఇతరపాఠాలకు తావు లేకపోయింది.

## మంత్రద్రష్టలగు మహర్షులు

మానవులకు పరమశ్రేయస్సాధనాలు వేదాలు. మహర్షులు గొప్ప తపస్సుచేసి దీక్షతో దివ్యమైన శక్తిని సంపాదించుకొని, వేదమంత్రాలను తమ దృష్టికి తెచ్చుకొన్నారు. అందుకే వారిని మంత్రద్రష్టలంటారు. ఋషి అంటేనే ద్రష్ట. వేదమంత్రాలను ఎవరూ రచించలేదు. అవి అపౌరుషేయాలు. అంటే ఎవరి (పురుషుని) చేతను రచింపబడనివి. అందువల్ల ఋషులు వాటికి ద్రష్టలే గాని కర్తలుకారు. వేదమంత్రాలను ప్రత్యక్షంగా చూసి, ఇతరులకు తెలియజేయగల వారే మంత్రద్రష్టలైన మహర్షులు.

ప్రస్తుతం సామసంహితను దర్శించిన ఋషులెవరు? వారెన్ని మంత్రాలను దర్శించారు? ఇతర సాహిత్యాల్లో ఏవిధంగా వారు వర్ణింపబడ్డారు? అనే విషయాలిక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

సామసంహితను దర్శించిన మహర్షులు నూటయాభైమందికి పైగా ఉన్నారు. అందులో కొందరే ముఖ్యంగా పేర్కొనదగినవారు. వారు వసిష్ఠుడు, వామదేవుడు, భరద్వాజుడు, మేధాతిథి, కణ్వుడు, విశ్వామిత్రుడు, గోతముడు, శునశ్శేపుడు, సోభరి, ప్రస్కణ్వుడు, జమదగ్ని, నృమేధుడు, ప్రగాథుడు, కశ్యపుడు, రేభుడు, అత్రి, వాలఖిల్యులు.

## ఛందస్సు

శిక్ష, వ్యాకరణం మొదలైన ఆరువేదాంగాలలో ఛందశ్శాస్త్రం ఒకటి. అది వేదపురుషుడికి పాదస్థానంగా చెప్పబడింది. ఛందస్సుకు సంబంధించిన అనేకగ్రంథాలు పూర్వం ప్రచారంలో ఉండేవి అందులో చాలా గ్రంథాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

ఋక్ ప్రాతిశాఖ్యం మొదలైన కొన్ని ప్రాచీనగ్రంథాలలో ఇతర విషయాలతోపాటు ఛందోరీతులు కూడా నిరూపింపబడ్డాయి. పింగళుడూ, జయదేవుడూ వీరిద్దరూ 'ఛందస్సూత్రం' అనే పేరుతో రచించిన రెండు గ్రంథాలు వైదిక - లౌకిక ఛందస్సులను విపులంగా నిరూపిస్తున్నాయి. అందులోనూ పింగళుని గ్రంథమే ఛందశ్శాస్త్రాల్లో పరమప్రామాణికంగా ఆదరింపబడుతున్నది.

